వారేల యూరకొని యున్నారు? అధికార్లు మేమన, వారేమియు చేయజాలరు. పోలీసు శాఖ ఒక పరిపాలన వ్యవస్థ మాత్రమే. ఈ దొంగల యిబ్బందితోడి పైరము తమ కరము కాదని వారనుచుందురు. ఒక్క దొంగను బట్టుటకుగాను పోలీసు బంట్లు తమయొక్కయు, తమ కుటుంబము యొక్కయు, ధన, మాన ప్రాణములను కోలు పోవలసి యుండును.

అదియునుంగాక యీ ముష్కర సంఘముల తోడ్పోరాడుట వ్యర్థమని గూడ వారెంచుదురు. ఈ ముష్కరులకు స్థానిక రాజకీయ నాయకులతో పరిచయముండును కావున బట్టుబడిన దొంగలు విడుదల చేయబడుచుందురు. కొలది దినముల క్రిందట పోలీసువారు దొంగల రావులలో జొరబడి, యనేక మంది హంతకులను, చోరులను బట్టుకొనిరి. కాని యొక సూక్ష్మబుద్ధిగల న్యాయవాది కాస్త్రరూపకమగు అభ్యంతరము ముల గల్పించి, వీరినందరిని విడిపించెను. దొంగల సంఘములు, పెద్ద కంపెనీలు, బ్యాంకులు, ఎతెనిగా ప్రసిద్ధులగు న్యాయవాదులను—సొమ్మిచ్చి యుంచుచుందురు. వీరు న్యాయాధిపతి చిన్న జో జుమునటుల సాక్ష్యమునిల్పి, నక్కలవలె కాచుకొని యుందురు విచారణలో గాని, తీర్పులో గాని చిన్న పొరపాటు జరిగినచో వెంటనే పై కోర్టునకు అప్పీలు చేయుదురు. ఇట్లు న్యాయము రద్దుపఱచబడుచున్నది

## వివాహమునకు తగిన వయస్సేది?

పురుషులు వివాహమాడుటకు మంచివయస్సేది యను నొక సమస్య ఇంగ్లాండునందిటీవల బయలు దేరినది. ఆ సమయమున ప్రఖ్యాత పురుషులెంతవయస్సులో వివాహమాడి యుండిరో తెలిసికొని అటు తరువాత నిర్ణయమును గావించుట మంచిదని కొంత మంది నిర్ణయించిరి. ఆ సమయమున నీక్రింది వివరములు ప్రోగుచేయబడినవి.

అమెరికా రాష్ట్రమందలి ప్రఖ్యాత సైనికులును సైమానికులును ముప్పది వత్సరములు దాటినయనంతరమే వివాహములు గావించుకొనినట్లు తెలియుచున్నది. నిలిబెరీ కళాశాలా ప్రధానాచార్యులగు సర్ వెట్గిన్హాముగారు సైన్యమందు జేరి తలంపుగల యువకులందరును ౩౦ వత్సరముల కనంతరమే వివాహమాడుట ఉత్తమమని తెలిపిరి.

ప్రసిద్ధ పురుషులు వివాహకాలమునాటికి వారల వయస్సులు

| | | |
|---|---|---|
| గ్లాడ్స్టన్ | ౨౬ వత్సరములు. | |
| టామస్ హార్డీ | 33 వత్సరములు | |
| రామ్సే మాక్డొనాల్డు | 30 | ,, |
| హెంగార్టు ప్రభువు | 33 | ,, |

గ్రంథకర్తలు

| | | |
|---|---|---|
| రుడ్యార్డ్ కిప్లింగ్ | 27 | ,, |
| జి. కె. చెస్టర్టన్ | 27 | ,, |
| సర్ విలియమ్ ఆర్చర్ | 25 | ,, |
| సర్ ఫ్రాంక్ బెన్సన్ | 28 | ,, |
| హెన్రి ఎయిన్లి | 24 | ,, |

మతశాఖ

| | | |
|---|---|---|
| కాంటర్బరీ ఆర్చిబిషప్పు | 30 | ,, |
| బర్మింగ్ హామ్ బిషప్పు | 42 | ,, |
| డీన్ ఇంజ్ | 25 | ,, |

(సమర్పిత)





గోలకొండ పత్రిక

ప్రభవ సంవత్సర మాఘ శు|| ౧౪

శనివారము

# రాష్ట్రీపు జాతరలు పరిశుభ్రత్వవిధి

---

పూర్వకాలము నుండి నేటివఱకు జాతరలీ రాష్ట్రమందు అనేక స్థలములందు జరుగుచున్నవి. దేవతాదర్శనమునకు వచ్చువారును, తమాషా చూచుటకు వచ్చువారును, వ్యాపారార్థము వచ్చువారును నీ జాతరలలో విశేషముగా నుందురు కొన్ని జాతరలలో ఒక లక్ష వరకు కూడ జనులు వచ్చుచుందురు. నిజాము రాష్ట్రమందు నల్లగొండ జిల్లాలో కొన్ని గొప్ప జాతరలు జరుగుచున్నవి. మఱియు మహబూబు నగరము జిల్లాలో కురుమూర్తిలో శ్రీ రంగాపురములో ఎట్లప్రోలులో మూడు గొప్ప జాతరలు జరుగుచున్నవి. ఇవిగాక గద్వాలలో నొక గొప్ప జాతర జరుగుచున్నది.

ఈ జాతరలను రైతులకు గొప్ప లాభకారులుగను వానిని చేయుటకవకాశములున్నవి కాని యిప్పటి స్థితిచూడ నివి నష్టకారులుగా పరిణమించుచున్నవి. పూర్వకాలము వ్యాపార సౌకర్యములు లేకుండెను కావున సంతలు జాతరలు ప్రధానమై యుండెను. ఆ కాలములలో రైతులొక సంవత్సరమునకు కావలసిన ముఖ్య వస్తువులను జాతరలలో తీసికొని పోవుచుండిరి. ఇప్పుడట్టి యవసరము విశేషముగా లేదు. ఇంతేగాక జాతరలలో పరిశుభ్రత "సఫాయి" యుండనే యుండదు. కాన జనులకవి నష్టదాయకములగుచున్నవి. రెండు దినములలో జాతర స్థలమంతయు మురికి లేచి దుర్గంధముతో నిండిపోవును అనేక మారులు కలరా మున్నగు జాడ్యములు సంభవించి వేనవేలు చచ్చిరి. మరియు నచ్చట భోజన పదార్థములను పరీక్షించువారు లేరు. మురిగిపోయిన ప్రాత సోడా లిమినేడులు, దుమ్ము వాసనతో నిండిన మక్కిన మిఠాయి, పులికల్లు మున్నగునవి విశేషముగా వాడబడుచున్నవి.

ఇంక ౨ దినములలో గద్వాల జాతర ప్రారంభమగును. ఈ జాతర మురికిలో కురుమూర్తికి తర్వాతది. ఇంకొక మాసమునకు వనపర్తిలో చేరినట్టి శ్రీరంగాపురము జాతర జరుగును. ఈ రెండు జాతరలును నొక్కొకటి సుమారు ౧౦ దినముల వరకు జరుగును. ఇట్టి స్థలములో అధికారులీ క్రింది యేర్పాటులు చేసిన బాగుండును.

౧ బావులలో నెవ్వరిని బట్టలనుతుక నీయకూడదు. స్నానము చేయనీయ కూడదు.

౨ జనులను జాతర స్థలమునుండి అర్థ మైలు దూరముపైననే బహిర్భూమికి బోవునటుల జేయవలెను.

౩ తిను పదార్థములను లంచములు తినని డాక్టరుచే పరీక్ష చేయింపవలెను.

౪ కల్లు దుకాణముల జాతరకొక మైలు దూరమున నుంచవలెను.

వీటితోపాటుగా నీక్రింది క్రొత్త యేర్పాటులు చేయుట చాల సమంజసము.

౧ మన దేశము వ్యవసాయ దేశము కావున రైతులకు సులభముగా, చౌకగా, మన దేశమందే దొరుకు క్రొత్త క్రొత్త పనిముట్ల లాభమును చూపించవలెను. ఈ పనిముట్లను ప్రదర్శింపవలెను.

౨ వ్యవసాయ సంబంధమగు పలుముల ను యక్షిశదీపముల ద్వారా బోధింపవలెను. (Lantern lectures)

౩ మన దేశమున కనుకూలములగు పరిశ్రమలేవి యున్నవో వానినన్నింటిని చూపించవలెను. ఎట్లనగా, బిదర్, నారాయణపేట, దేవరకదిర మున్నగు స్థలములందు తయారగువస్తువుల ప్రదర్శింపవలెను. యీ పరిశ్రమలెట్లు తయారు అగునో బోధింపవలెను. మఱియు నేతవాండ్రకు లాభకారులగు మేలైన మగ్గములను ప్రదర్శింపవలెను.

ఇవన్నియు చేయవలయుననిన వ్యవసాయ వ్యాపార పరిశ్రమల శాఖకు అధికారులైన కాలిన్సుదొరగారు ఈ విషయములో శ్రద్ధ వహించవలయును. ఈ ప్రకారము ప్రతి ప్రసిద్ధమగు జాతరయందు చేసినచో నీ దేశములో రైతులు చాల త్వరగా నభివృద్ధి పొందుదురు. సర్కారువారు రైతుల హృదయమునాకర్షించవలెననిన నిదియే యుత్తమ సమయము. ఉత్తమ పద్ధతి. కాలిన్సుగారు తప్పక యీ పద్ధతి బూనుదురని కోరుచున్నాము.

## మానవసేవా సమితి

---

దక్కను మానవసేవా సమితి, తన పేరును సార్థక పఱచుకొనుచున్నది. ప్లేగువల్ల అనేక సంఘముల కార్యములకు నిరోధము గలిగినను, ఈ సంఘమువారు యథాప్రకారము శ్రద్ధతో పనిచేయుచున్నారు స్కౌట్ ఉద్యమము కేవలము డంబమయి పోయినది సత్కార్యమొక్కటియైనను (Good turn) ప్రతి దినము చేయవలెనని ప్రతి స్కౌటునకు ప్రకటిత ఆవశ్యము. సేవయే యీ యుద్యమముయొక్క ముఖ్యసూత్రము. కాని నేడు స్కౌటులు చక్కని దుస్తులు వేసికొని "పరేడు" చేయుటకు తప్ప వేరెందుకును నికివచ్చుటలేదు. జీవరక్షా మండలివారి పక్షము జంతుహింస మాన్పుటయే గాని దుఃఖార్తులకు సహాయము చేయుట కాదుకదా బోలు! ప్లేగువలన నూరి విడిచి పారిపోయిన వారికనేకులకు నిలువనీడలేదు; ఇంటి యజమాని చనిపోవునెడ నేమియు తెలియని విధవను, పిల్లలను పరామర్శించు దిక్కులేదు; వ్యాధిగ్రస్తులయిన వారికి సలహాగాని, మందుగాని యిచ్చువారులేరు; ఇట్లు సేవాసంఘములు శ్రద్ధవహించవలసిన విషయములనేకములు గలవు. కాని యట్టి పరిశ్రమ జరుగుటలేదు. మానవ సేవాసమితివారు మాత్రము తమ కార్యములను యక్షీణోత్సాహముతో యథాప్రకారము చేయుచుండుట ప్రశంసార్హము. సంస్కార ప్రచారక యత్నములు కష్టజీవులకు, న్యాయము తామొసగ కొలది చేయుచునేయున్నారు. ముఖ్యముగా ఎఱుకలవారి గూర్చి వీరుస్థాపించిన బడియొంతయు నెన్నదగినది. హిందూ సంఘమునకు జెందిన నిమ్నజాతుల వారనేకులు స్వసంఘమున నుండి యభివృద్ధి జెందుటకు తమకట్టి యవకాశము లేకపోవుటచే అన్యమతముల స్వీకరించుచున్నారు. ఇట్టిది నిరాటంకముగా సాగినచో హిందూసంఘము అనేక కాలములో క్షీణించును. ఈ యంశమును గ్రహించి మానవ సేవాసమితివారు మాలమాదిగల యభివృద్ధికై పాటుబడుచున్నారు కాని వారికితగు ధనసహాయము లేకయున్నది. కాన శ్రీమంతులు, సామాన్యులు, ప్రజాహితమునకై ప్రత్యేకింపబడినధననిధుల తదితర సేవాసంఘములు, వీరు చేయుచున్న యమూల్యమగు కృషిని గమనించి, సాధ్యమయినంత సహాయమును చేయవలెనని మేము హెచ్చరించుచున్నాము.

## స్థానికవృత్తాంతములు

### మహమ్మదీయ మతపుసాత్వికము

నిన్న సాయంకాలము ౫ గంటలకు పురోద్యానమునందు మాస్టరు పీరులగు లార్డ్ హెడ్లే గారు మహమ్మదీయ మతపు సాత్వికమను విషయముపై గంటకాలముపన్యసించిరి. అగ్రాసనాధిపతిగారి ఉపసంహారోపన్యాసానంతరము సభ ౭ గంటలకు ముగింపబడెను.

### ప్లేగు ఆస్పత్రి

ప్లేగు దినదినము హెచ్చుటను గమనించి వైద్యశాఖావారు బారదరి, నాంపల్లి యున్నగు స్థలములందు రెండుప్లేగు ఆస్పత్రులను నెలకొల్పి యున్నారు.

### నవాబు వలీఉద్దౌలాగారు

సైనికశాఖా మంత్రులగు నవాబు వలీఉద్దౌలాగారు లార్డ్ హెడ్లే గారితో సహా గతవారము నాడు ఉస్మానియా వైద్యాలయమును దర్శించిరి.

### కాలేజి విద్యార్థుల సమ్మె

నైజాముకాలేజి ఇంటర్మీడియేటు విద్యార్థులు ప్లేగుజాడ్యము వృద్ధియం దుండుటం గాంచి ఇతర పాఠశాలలు కచేరీలతో సహా శెలవొసంగక పోవుటచే సమ్మెగట్టిరని తెలియవచ్చెను.

### ఉపాధ్యాయుల మహాసభ

ప్లేగుకారణ మాపబడిన హైద్రాబాదు ఉపాధ్యాయుల మహాసభ మార్చినెల రెండవవారమున జరుగనున్నదని తెలియుచున్నది

### మహిళామహాసభ

ఢిల్లీయందు జరుగనున్న మహిళా మహాసభయందు పాల్గొనుటకై శ్రీమతి మనోరంజనమ్మపిళ్లే గారు హైద్రాబాదు ప్రతినిధులుగ వెడలియున్నారు.

### కాలమహాత్మ్యము

ప్లేగు అను వికృతరోగమునకు వెరచి, గృహంబులను విడచి, అజ్ఞాతవాసము చేయుచున్న జనులు, రెండురోజులనుండి వర్షము కురియుటవలన అల్లల్లాడు చుదురు సేయునదిలేక. గృహోన్ముఖులగు చుండుటజూడ కలికాలపు వైఖరియిదియేమో యగుండునని తోచుచున్నది.

* * * * *

### అమెరికా సంఘజీవనము

అమెరికాలో ౧౯౨౬ లో ౧౯౨౬౦ పెండ్లిండ్లు పెటాకులైనవి. గతిపిందగింజ తననలు పెరుగదన్నట్లు మేయోకన్య భారతీయుల నాక్షేపించుచున్నది.

* * * * *

### రయాప్రారితమగు శిక్షలు

రష్యాలో బందీలు కొన్ని సమయములందు వారిండ్ల కేగవచ్చునట. ఆకాలము శిక్షలోనుండి తగ్గించెదరట.

* * * * *

## గద్వాల జాతర

### ప్రయాణికుల మొర

అయ్యా,

రెండు మూడు దినములలో గద్వాల జాతర జరుగును ఈ జాతరకు వేనవేలమంది మహబూబు నగరము నుండియు, కర్నూలు, అలంపూరు నుండియు జనులువత్తురు కాని రైలు యథాప్రకారము కొద్ది డబ్బాలతోనే వచ్చును చాలామందిని గూడ్సు డబ్బాలలో కట్టెపుల్లలతో పాటిగా లోనికి నూకి రెక్కించి పంపుదురు., మరియు అనేకులు రైలులో నొకరిపై నొకరు కూర్చుందురు ఇంకను చోటుచాలని వారు రైలుతప్పి ఆగిపోదురు. కావున నీసంవత్సరమైన రైల్వే వారు స్పెషల్ రైళ్లను గాని లేక అనేక డబ్బాలుచేర్చి గాని నడిపింప ప్రార్థితులు

(ప్రయాణికుడు)



## రైల్వే నోటీసు

### పెనుగంచిప్రోలు జాతర

ప్రతిసంవత్సరము జరుగుచుండు యీ జాతర నందిగామ తాలూకాలోని పెనుగంచి ప్రోలు గ్రామములో జరుగును. ఇది మహా ఘనతవహించిన నిజాంసర్కారువారి రైలు లైనులోని మధిరస్టేషనుకు 6½ మైళ్ల దూరముండును. యీ జాతర ౧౯౨౮ వ సంన ఫిబ్రవరి ౫ నుండి మార్చి ౯ వరకు జరుగును. వీనిలో ఫిబ్రవరి ౫ నుండి ౯ వరకును, మార్చి ౯ వ తారీఖున్ను, ముఖ్య దినములు.

సాధారణముగా నడుచురైలు బండ్లకు ఎక్కువడబ్బాలు పెట్టుటయేకాక, ప్రజలు కోరిన విధమున బెజవాడనుండి మధిర వరకు ప్రత్యేకముగ మరికొన్ని రైలుబండ్లు నడచును. యాత్రికుల సౌకర్యముకొరకు భోజనము, నీటి ఏర్పాటులు మధిర స్టేషనులో చేయబడి యున్నవి.

ట్రాఫిక్కు మేనేజరు ఆఫీసు
సికింద్రాబాదు
1వ ఫిబ్రవరి 1928

జి. సెడ్డీ
ట్రాఫికు మేనేజరు
(ఆజ్ఞచే)

## జాబులు

# సికింద్రాబాదు రైల్వే స్టేషను

"గోలకొండ" సంపాదకులకు

అయ్యా,

దయతో క్రింది విషయమును మీపత్రికలో ప్రకటింప ప్రార్థించు చున్నాను.

ఎంతకాలము వేచియుండినను రైల్వే యధికారులు తమ తమ విధాయకమును నిర్వహింపకుండుట మిక్కిలి శోచనీయము. ఘనత పొందిన నిజాంసర్కారు వారి (N. G. S. Ry.) ఇనుపదారికి ప్రధానస్థానమై, రాజధానికి తిలకమైయున్న సికింద్రాబాదు పట్టణమునందే యింతటి దుస్థితియుండ మిగిలిన స్టేషనుల గతి యడుగవలయునా? సూర్యోదయమునకు పూర్వము ౫—౨౦ నిమిషములనుండి రాత్రి ౯—౩౦ గంటలవరకు ప్రయాణీకులబండ్లు విధినిరామయము లేక తిరుగుచుండెను. స్టేషనులో జనులు యెండను పులములచూచుచు, వానను దడియుచు నుండు దుస్థితిగలైగా! హైద్రాబాదు (డి. జి.) కున్నంతి యదృష్టము కూడ దీనికి లేకపోయెగా! వచ్చునది యెండకాలము ముందు శాతోష్ణ తీవ్రత నప్పుడే సూచించుచున్నది. బ్రిడ్జిపైన యింతపై కప్పుండినచో ప్రజలు యీ యెండలను మాడక నింత తలబాధ కొనుటకైన నవకాశముండును. బెజవాడ నుంచి బొంబాయిపై ప్రపోవుబండి సమీపమున సిమింటుతో కట్టిన అట్టిమాత్రి యెంతవరకు ప్రజలను యెండనుండియు వాననుండియు కాపాడునో చూచినవారికి తెల్లమే! ప్రజలనుండి ధనము లాగుటయేయీకంపినీ వారియందు గన్పట్టు తెలివి, ప్రజలకు సౌఖ్యము గలిగించుట యందేలకైకొనరాదు. ఇకనైనను ప్రజల కష్టంబుల నరసిప్రవర్తించుట కీకంపెనీవారికి దైవముబుద్ధినొసంగుగాక. పెక్కండ్రు దేశీయులు విద్యాగంధ శూన్యులౌటచే, వారుపెట్టిన పాట్లెల్లను యోపికతో భరించుచుండుటవలన, వారీరీతి ప్రజోప యోగములందు నిర్లక్ష్యము జూపుచున్నారు. ఎంతకాల మింకను యిట్లుబాధించుట! మూడవ తరగతి ప్రజల విశ్రాంతి స్థలములో ఏరెండు మూడు సిమెంటు బెంచీలో తప్ప కూర్చుండుటకు బెంచీలను గూడ వేయలేనంతటి యసమర్థత కంపినీవారికి గలిగె కాబోలు. ఇకనైన వీరిదృష్టి ప్రయాణీకుల సౌకర్యములపై మరల్చిన యెంతయు సమంజసము గానుండును.

ఇట్లు
ప్రయాణీకుడు.

# సికింద్రాబాదు ప్రజా ప్రతినిధులు

గోలకొండ సంపాదకులకు

అయ్యా

ఈ క్రిందిలేఖను మీపత్రికలో ప్రకటింప వేడుచున్నాను

పదింబదిగ వచ్చు మహామ్మారి యుపద్రవంబున కెట్టెటో దాని పాతంబడకుండ, ప్రాణంబు లఱచేత నిడికొని వనవాసంబు జేయుచు, ధనమాన ప్రాణంబులకు జెక్కుడుముల గుడుచున్న నిష్పాగి వాసులను అధికారులు కటాక్షించి ఇంటిపన్నులను దీసికొనుటను మాని వేసిరన్న మాట సాధారణ సంసారులను, పాటకవర్గమునకు ఎంతయు సంతసమును గలిగించినది. ఇటీవల ప్రతియింటికిని ఇంటిపన్నుకై యిచ్చిన నోటీసు నతికించియుంటయు, బన్నులు వసూలు చేయువారు పన్నుల నటుగొంటయు గాంచమిగుల నాశ్చర్యమయ్యె. ఈ ప్రజా ప్రతినిధులు (Committee members) ఓట్లకై వెనగులాడు నప్పుడు పల్కుమాటలో దారంపు ఎల్కులు. కార్య రూపమును దాల్చునప్పుడు పలాయనమంత్రము గాబోలు! వీరాపేక్షలకు దమ ప్రజలను గాచిన సనుసాయు మేదియో ప్రేలు మకుంచి జూపుడు సంసారము పెనుభారముగ నుండుదిన ములలో యీ ప్లేగు దీనికై యేమి వా…

రోక్కము పూర్తిగ నిచ్చించి నిరుపయోగమగు బాంగులు కట్టెలు, చాపలతో గుడిసెవల్లి చలికిని, వానకును ఎండకు నోర్చి దినములు బుచ్చి తిరిగి గృహంబుల జేరియుంచుక సుఖింతుమన్న, యంతలో నీ కంటోన్మెంటు వారి ఇండ్ల పన్నులు! రావు సాహెబులు, రావు బహద్దూరులు దివాన్ బహద్దూరులు, ధనికులగుటచే బీద ఎగసాదులు పడు మహాకష్టమును వారెరుంగజాలరు. ప్రజల కష్ట నిష్ఠూరముల నెఱుంగని యీ బిరుదాంకితులకు ప్రజా ప్రాతినిధ్యమేలనో? వారిమాటలు వారి వోటర్ల మాటావుడి గాంధినతోడనే యుబ్బితబ్బిబ్బులై వోట్లనిచ్చుట తెలియును గాని ఇట్టి ప్రజాహిత కాలమునందు వీరు చేయు సాహాయ్యమెమంత యైన లేదని తెలుసుకొన లేరు. తిరిగి ఓట్లకాల మరు దెంచుచున్నది ఇప్పటికైనను కనుదెఱచి ప్రజాహితత్పరులైనవారల ఓటు వడుగుటకు వీలైనయెడల మూడు నెలలు (౯౦ రోజులు) ఇండ్ల వదలిన పన్ను నివ్వ నక్కరలేదని వాదుక. అట్టిది నిజమే యైనచో యీ పన్నుల వసూలు చేయువారేల యిట్టి కార్యమునకు గడంగవలెను? అధికారులె దానినంగీకరింపకున్న రెండేల మహాజనుల సభ నొకదానిని గావించి ప్రజల యసమ్మతిని రేల తెలుపరాదు? ప్రజల యీ కష్టములనెల్ల జూచుచు యీ కమిటీ మెంబర్లు అధికారులకు భయపడి పిర్యాదు నను లెదరా?

ఇట్లు

పురవాసి

## బాలకొండ

(స్వకీయ విలేఖరికి)

మాయూరు జాగీరగుటంబట్టి యేఅధికారులైనను, శ్రద్ధతీసుకొనక పోవుట ప్రజల దురదృష్టము ఇచట పరిశుద్ధ సంఘము పేరునకైనను లేదు. ఎచట చూచినను పెంటలు. ముఱికి నీటి కాలువలు యుండుట సాధారణముగ పల్లెయైనను బాగుండును నామమునకు ఊరు ఇంతగొప్పదైనను పరిశుద్ధము బొత్తిగ లేదనుట నిర్వివాదాంశము ముఖ్యముగ పెద్ద త్రోవలనుండి ఉదయాస్తమానములయందు పశువులు గుంపులు గుంపులుగ పోవుట వలన ధూళిచే ఒక గృహమైనను కనబడక పోవుటయేగాక వర్తకులు దుకాణములు మూసి యింట్లో కూర్చుండ వలసినదే. చిన్న చిన్న బాటలున్నను, పెద్దత్రోవలనుండి పశువులను పోనిచ్చుట కడువిచారకరము. స్థానిక యధికారులైనను ఇట్టి స్థితులను చక్కగజేసినబాగుండెడిది.

### ఉర్సు

ఇస్పందార్ ౨౪ వ తేది నుండి ఇచ్చట ఉర్సు ప్రారంభమగును అనేక జనులు ఉర్సును వీక్షించుటకై విచ్చేయుచున్నారు.

### నాగాపురము

మైగ్రామము సుమారు ఇచ్చటికి రెండు మైళ్ల దూరము ఒక ఆంధ్రునికి ప్రతిశనివారము దేవతా వేశించునట చుట్టుముట్టు పల్లెటూర్లనుండి అనేకమైన ప్రజలు పుత్రసంతానమును బడయుటకై భూతపిశాచములును రోగనివారణమునకై ప్రతీకారము జెప్పుచున్నారు. కాని నేటికొకరైనను వరము పొందితిరాయని ప్రశ్నించిన శూన్యమునాల్పి చెప్పవలెను అవాక్కురియము కోటికి కాళ్లుచాపిన స్వార్థ స్త్రీ పురుషులు కూడ పడుచుంటు లేమకుంటు పోవుట ఇది వెర్రితనమనక ఏమనవచ్చును.

---

శ్రీయుత లోకేగారి లక్ష్మణ శర్మగారు ఆంధ్రోద్యమ ప్రచారము జేయుచు ఈ గ్రామమునకు దయచేసి యుండిరి శ్రీయుత పి. యస్. బాపురావు గారి, సహాయమున గ్రంథాలయ స్థాపనా ప్రయత్నము చేసిరి. కొందరు మహానుభావులు చందాలిచ్చుటకు యంగీకరించిరి. ఉదయమున సభజేసి స్థాపించుటకు తీర్మానము జేయబడెను కాని ఇచటి ప్రజల సరళి చూడుడు ఉదయమునకె శ్రీరావుగారి దేహమస్వస్థమైనందున నిర్మలనుండి హైద్రాబాదకు తిరిగి పోవు సమయమున కావలయునని చెప్పగ అదె ప్రకారము మశ్లీవిచ్చెసిరి. కాని పై చందాలిచ్చుటకంగీకరించిన మహానుభావులు కొందరు శ్రీరావుగారితో మా ఇంటివారలు కోపగించుచున్నారని చెప్పి తమ అసమ్మతమును జూపిరి ఇక గ్రామస్థులెవ్వరును అభిమానమును కనుపరచలేదు నిష్కారణముగ శ్రీ లక్ష్మణశర్మగారిని రప్పించినందులకు రావుగారు చాల చింతించి స్వయముగ గోలకొండ పత్రిక తెప్పించుట కంగీకరించిరి మా యూరి వారికి గ్రంథాలయము పాఠశాలల వంటి ఉత్తమ కార్యములందభిమాన మెప్పుడు కలుగునో తెలియదు.

REG. No. N. 45. REG. No. M. 2185

గోలకొండ పత్రిక.

ట్రూపుబజారు హైదరాబాదు, దక్కన్

సంవత్సరము చందా రు. ౬-౦-౦

అర్ధసంవత్సరము „ „ ౩-౧౨-౦

విడి పత్రిక ౦-౧-౮

శ్రీయుత

STAMP.

Printed and Published by K Balakrishna Reddy at the Golkonda Press, Troop Bazaar, Hyderabad Dn.